ఆంధ్రపత్రిక ★ సారస్వతానుబంధం

1953 సం॥ డిశంబరునెల 13-వ తేదీ, ఆదివారము

# కీ. శే. డాక్టర్ యల్లాప్రగడ పరిశోధనలు

## అలోపతీ చికిత్సా విధానంలో నూత్నశకారంభం

(గత సంచిక తరువాయి)

2

సుబ్బారావుగారు లివర్ (కార్జము) పై విటమిన్లపై సాగించుచున్న పరిశోధనలఖ్యాతి లెడర్లీ లేబరేటరీస్ వారి చెవులసోకింది. వారు 1938 వ సంవత్సరంలో, తాము తయారుచేసి అమ్ముచున్న 'కాన్సారము' 'లివర్ ఎక్స్‌ట్రాక్ట్' (Liver extract) మందు గురించి న్యూయార్కు వద్ద నున్న వారియొక్క బ్రహ్మాండమైన, పెర్ల్ రివర్ (Pearl river) పరిశోధనాగారమునకు వచ్చి పరిశోధనలు చేయమని సుబ్బారావుగారిని ఆహ్వానించారు. హార్వర్డుతో టి సంబంధం తెంపుకునే యిష్టంలేక తిని, ఆదివారాలు 'పెర్ల్ రివర్' కువచ్చి పరిశోధనలు చేసి, సలహాలు యిచ్చి వెళ్ళుతుండేవారు సుబ్బారావుగారు. 'పెర్ల్ రివర్' వచ్చే వుండిపొమ్మని లెడర్లీ వారు అడిగినప్పటికీ హార్వర్డుకంటె 'పెర్ల్ రివర్' పరిశోధనాగారంలోనే ఎక్కువ పరిశోధనావకాశములు వున్నప్పటికీ, హార్వర్డును విడిచిపెట్టడానికి సుబ్బారావుగారికి బుద్ధిపుట్టలేదు. ప్రయివేటు సంస్థలో చేరితే, ఆఫీసు డ్యూటీలు ఎక్కువయి, పరిశోధనావకాశం బాగ తగ్గిపోతుందేమోనని ఆయన భయం. చివరకు లెడర్లీ వారు ఈయన మనోభిప్రాయము గ్రహించి "నీకేమీ అభ్యర్థనం అక్కర లేదయ్యా సుబ్బారావుగారూ! నీ లెబొరేటరీ, నువ్వు టెండర్సనిలో వేలు పెట్టవలసిన అవసరంలేదు రావయ్యా" అని ధైర్యం చెబితే 1940 సంవత్సరంలో 'పెర్ల్ రివర్' పరిశోధనాగారమునకు అసిస్టెంటు డైరెక్టరుగా వచ్చిచేరారు. రెండేళ్ళు గడవగానే డైరెక్టరయి, 2500 మంది పరిశోధక బృందాన్ని నడిపే సారథిఅయారు సుబ్బారావుగారు.

తను, తనలేబొరేటరీ, పరిశోధన తప్ప మరొకపనిలేని జీవితం ఎక్కువ, పరిశోధనకు డబ్బు మంచినీళ్ళ ప్రాయంగా ఖర్చు పెట్టవచ్చు- యింక కావలసినదేముంది సుబ్బారావుగారికి అంతకంటె బ్రహ్మానందమింకేముంది! 'స్ప్రూ' మీద దండయాత్రకు పెద్ద పెద్దఅంగలు వేసుకుంటూ బయలుదేరారు. టన్నులకొలది జంతు కార్జములు తెప్పించడం, వాటిని పలగగొట్టడం, పారంభియ్యడం, వాటిలోని నూతనవిభాగాల రూపురేఖలు పసికట్టడం. 16 మంది అనుచరులసహాయంతో యిరవైనాలుగు నెలలు కష్టపడి, చివరకుసాధించారు సుబ్బారావుగారు — స్ప్రూవ్యాధిని సమూలంగా నాశనంచేసే, 'ఫోలిక్ యాసిడ్' అనే మహత్తర ఔషధాన్ని కనుగొన్నారు. ఒకటన్ను అంటె 90 మణుగుల కార్జములలోనుంచి తయారుచేస్తే, బటాణి గింజంత 'ఫోలిక్ యాసిడ్' తయారు అవుతుంది. అంటె 16 వరిగింజల బరువు గల మందు ఖరీదు పదివేల రూపాయలు. అంతటి ఖరీదైన యింతటిగుణము గల మందది! ఇంత ఖరీదు మందైతే, ఔషధకారులు కొనుక్కొవడానికి వినుకొస్తాడుకదా? మరియెలా? దానికీ పద్ధతి కనుగొన్నారు సుబ్బారావుగారు. ఫోలిక్ యాసిడ్ లో వుండే మూలపదార్థాల రూపురేఖలు ఏమిటో తెలుసుకుని, అదే రూపు రేఖలలో వుండునటుగా కల్పనికంగా, సంశ్లేషణ (Synthetic) పద్ధతులతో, మామూలు రసాయన పదార్థముల నుంచి, జంతు సంబంధం లేకుండా ఫోలిక్ యాసిడ్ తయారుచేశారు. ఆయన సంశ్లేషణ పద్ధతి కనుగొన్నాక 'ఫోలిక్ యాసిడ్' ధర బంగారం ధరకు సుమారు సమానంగా దిగింది. ఇక రక్తక్షీణతి రోగులు, స్ప్రూవ్యాధి పీడితులు, కృశించి, నశించిపోయె దుర్గతి తప్పింది. సుబ్బారావుగారి మొదటి ఆశయము నెరవేరింది. స్ప్రూవ్యాధి హతమయిపోయింది. సుబ్బారావుగారు అంగీకరించనప్పటికీ, ఫోలిక్ ఏసిడ్ కనుగొన్న విషయం, 20వ శతాబ్దపు ఉత్కృష్ట విజ్ఞానవిశేషాలలో ఒకటి. శాస్త్రలోకమంతా హర్షించిన విషయమది.

శ్రీ కె. శేషగిరిరావు

ఆశయసిద్ధితో గర్వపడ్డారా సుబ్బారావుగారు? లేదు. పరిశోధనల ప్రగతి ఆపివేశారా? లేదు. మానవజాతిని పెనుభూతములులాగ పట్టి పల్లార్చుచున్న, విషూచి, మశూచి, కాన్సర్ బోద జ్వరత్యాదులను శలమట్టం చేయాలి. అది కదా తన పూర్తిజీవితాశయం!

రక్తంలోని తెల్ల కణాల సంఖ్య అధికంగా పెరిగిపోయి నివారణ దుస్సాధ్యం అనితలంపబడేదుర్వ్యాధి అయిన 'లుకేమియా' (Leukaemia) ను అటకాయింపచేయుటకు అయిన 'ఎమినోప్టెరిన్' (Aminoptirin) ను, ఎందుకో అర్థంలేకుండా జీవకణాలు విపరీతసంఖ్యలో పెరిగిపోతూ ప్రథమదశలో, యక్స్‌రే రేడియం వైద్యాలు చేస్తే తప్ప ప్రాణి బ్రతుకని 'కాన్సర్' వ్యాధి నివారణకు సహాయకారిగావుంటే 'టెరోప్టెరిన్' (Teropterin) తయారుచేశారు సుబ్బారావుగారు. దోమలవల్ల వ్యాపించుచూ, ఉష్ణదేశవాసులలో పీల్చి పిప్పి చేస్తూ, బ్రతుకు దుర్భరము చేసే బోద జ్వరం (ఫైలేరియా, (Filariasis) మీద అమోఘంగా పనిచేసే 'హెట్రజాన్' (Hetrazan) తమ సొంతంగా కనుగొన్నారు. సుబ్బారావుగారి ప్రకటనలు పరమసత్యాలయాయి. ఆశయాలు అద్భుతంగా నెగ్గాయి. ఏ పనుల కయితే తన జీవితమంకితం చేశారో, ఆ పనులలో చాలవరకు సంకల్ప సిద్ధులయారు.

పెనిసిలిన్ కాని, ఆరియో మైసిన్ గాని మైక్రో స్కోపులలో కల్పించే, సూక్ష్మజీవుల మీదనే అధికంగా పనిచేస్తాయి. మైక్రో స్కోపుకు అందని, వాటిసంగతేమిటో, వాటిని అరికట్టే విధానం ఏమిటో సరిగ తెలియని, సూక్ష్మాతిసూక్ష్మజీవులున్నాయి. వీటిని 'వైరస్' (Virus) అంటారు. పడిసము, న్యూమోనియా, మశూచికము, అటలమ్మ మొ॥ వ్యాధులు 'వైరస్'ల వల్లనే వస్తాయి. 'పాప్కిన్' (Popken) అనే ప్రతిభావంతుడైన అనుచరుని వీరి 'వైరస్'లమీద దండయాత్ర సాగించారు సుబ్బారావుగారు. అనేక ప్రయత్నాలయాక "డార్విసల్" (Darvisul) అనే మందు కనుగొన్నారు. దీని సంగతి యింకా పూర్తిగ తెలియలేదు. కాని యిది 'వైరస్' వ్యాధులమీద కొంతవరకు పని చేస్తోందని నిర్ధారణ అయింది.

ఎల్లాప్రగడ సుబ్బారావుగారి పర్యవేక్షణక్రింద పనిచేసిన, 75 ఏండ్ల వయస్సు గల డాక్టర్ బెంజమిన్ డగ్గర్ (Dr. Benjomin Duggar) పెనిసిలిన్ కంటె ఎక్కువ విస్తృతముగా పనిచేసే 'ఆరియో మైసిన్' (Aureo-mycin) అనే మహత్తర ఔషధాన్ని కనుగొన్నారు. కోట్ల కొలది రూప్యములు పరిశోధనకు ఖర్చు అయింది. కనుగొనబడినాక లెడర్లీ లెబోరేటరీస్ వారు 11 కోట్ల రూపాయల ఖర్చుతో యంత్రాలు స్థాపించి యీ మందు అమెరికాలో తయారు చేస్తున్నారు. ప్రస్తుతము మన దేశములో కూడ లెడర్లీ వారిచే తయారు చేయబడుతోంది. అనేక ప్రత్యేక వ్యాధులమీద పనిచేస్తూ వుంటుంది. 120 ఖరీదు చేసే గొప్ప మందుయిది.

ఇంతేకాక, సుబ్బారావుగారు లెడర్లీవారికి 'పెనిసిలిన్' చవకగా ఉత్పత్తిఅయే పద్ధతి చూపించారు. 2వ ప్రపంచ సంగ్రామంలో లెడర్లీ పరిశోధనాలయములలో 'బడ్ సీరమ్' తయారు చేయించి అది అమెరికన్ సైన్యానికి అందజేయించి, క్షతగాత్రులయిన అనేకమంది సైనికుల ప్రాణం కాపాడుటలో అమెరికా ప్రభుత్వము వారికి బాగుగ తోడ్పడ్డారు.

విజ్ఞాన విషయములలో పరిశోధన చేయుట కొక నూత్న విధానాన్ని సుబ్బారావుగారు అమలులోకి తీసుకువచ్చారు. ఆ విషయముపై వ్రాయబడిన, పరిశోధింపబడిన అనేక వేల విషయాలనన్నీ ముందుగా చదివేవారు. ఆ విషయములు వ్రాసిన శాస్త్రవేత్తలకలుసుకుని వారితో చర్చలు చేసేవారు. ఆ తర్వాత 'ప్లాను' వేసుకుని, తన ముందువాళ్లు తొక్కని మార్గములకు ఎక్కువ ప్రాముఖ్యత యిస్తూ, తీవ్రమైన పరిశోధనలు సాధించేవారు. ఈయన ప్రవేశపెట్టిన కొత్త పద్ధతిని నేడు వైద్య పరిశోధకులు కఠోరమైన కాన్సర్ వ్యాధి నివారణ విషయంలో అమలు పెట్టినారు.

2500 మంది విజ్ఞానవేత్తల మీద అధికారి అయి, కలకాలము శాస్త్రచరిత్రలో స్థిరస్థాయిగ నిల్చిపోయే అనేక విజ్ఞాన విషయాలు కనుగొని, అసంఖ్యాక ప్రజానీకానికి ప్రాణభిక్ష, ఆరోగ్య రక్ష యిచ్చి దిగంత యశోవిశ్రాంతుడైన సుబ్బారావుగారు నిగర్వచూడామణి. నిరహంకారసద్గుణయుతుడు. తను తెలుసుకున్న విషయాలను లోకానికి ప్రగల్భంగా ఎప్పుడు చెప్పలేదు. వాటి గురించి కదలించితేనే భిడియపడేవారు. చెప్పడానికి తను కనుగొన్న ప్రతి చిన్న విషయానికి తనతో కూడ పనిచేసిన అనుచరులందరికి కూడ తనతో సమానంగా గౌరవ మర్యాదలు జరిగితేనే గాని ఊరుకునేవారుకాదు. చిన్న, పెద్ద తారతమ్యం లేకుండా, తోడి పరిశోధకులు, శిష్యులు, సేవకులు పై అధికారులు, అందరు యీయనను, అతి అనురాగంతో 'సుబ్' అనే ముద్దు పేరుతో ఆప్యాయంగా పిలిచేవారు. రోజుకు 18 గంటలు అవిరామంగా ఇష్టంగా పని చేస్తున్నప్పటికి క్రింది వారు వచ్చి సందేహములు ఆయన ముందు వెళ్ళబోసేవపుడు, ఆయన విసుగులేకుండా వారందరికితగిన సలహాలుసమాధానములు యిచ్చుచుండేవారు.

వైద్య విజ్ఞాన విషయాలలోనే కాదు. లెక్కినవాటిలో కూడ యీయనకు కుతూహలము వుండేది. గుర్రపు స్వారి, కారు విహారము, 'గోల్ఫ్' ఆట ఆడుట, చెప్పుకున్నాడు తనచిన్న సొంతవిమానంలో బయలుదేరి దూరపు వూళ్ళలోనున్న స్నేహితులచూచి రావటమంటే యీయనకు సరదా.

మీదుమిక్కిలి సుబ్బారావుగారు గొప్ప దయార్ద్ర హృదయుడు. తన యింటి వద్దనున్న పలహార్ద్ర కండనీ యీయన అపరిమిత ప్రేమపాత్రుడు. అనుప్రతిరోజుంటే అనేకమంది పేదవారలకు భోజనానికి ఖర్చు, కష్టపడ్డానికి 'సహాయం' యిచ్చిన సందర్భాలు క్రిస్మస్ పండుగ సమయంలో, బహుమతులు కొనుక్కొలేని పేదలకు క్రిస్మస్ బహుమతులు కొని యిచ్చిన సందర్భాలు అనేకం వున్నాయి.

శరీరపోషణ పదార్థ శాస్త్రములో (Nutrition) గొప్ప దిట్ట. ప్రపంచములోని అత్యున్నత జీవరసాయన శాస్త్రపండితులలో ఒకడు, హిందు దేశములో జన్మించిన, శరీరరసాయన శాస్త్రజ్ఞులందరిలోకి మిన్న. జాతీయంగా, అంతర్జాతీయంగా, 20వ శతాబ్దపు మేటివిజ్ఞానవేత్తలలో నొకడు. జన్మసాఫల్యం అత్యుత్తమంగా గావించుకొన్న సుబ్బారావుగారు యిక మనకులేరు. 53 ఏళ్ళు జీవించి, పాతికఏళ్ళు అత్యున్నత పరిశోధనను సాగించి, మహోత్కృష్టమైన విజ్ఞాన ఫలాలు కోయించినసుబ్బారావుగారిని, ఆగస్టు, 1948 నాడు మృత్యుదేవత 'కరోనరీ థ్రాంబోసిస్' (Coronary Thrombosis) అనే వ్యాధికి ఎరగావించింది. రిడ్జిఫీల్డ్ చర్చిలో ఆయన భౌతికదేహం ఖననం చేయబడింది. సుబ్బారావుగారు అమరజీవి.

లెడర్లీ లెబోరేటరీస్‌లో పనిచేసిన ఎనిమిదిఏండ్లస్వల్ప కాలములో (1940-1948) అనేక చిల్లర విషయాల సంగతిఅటుంచి, ఫోలిక్ యాసిడ్, హెట్రజాన్, ఎమినోప్టెరిన్, టెరోప్టెరిన్ అనే మహత్తర ఔషధముల కనుగొని, స్ప్రూ, రక్తక్షీణతి, బోదజ్వరం, కాన్సర్ వ్యాధులనుండి, ప్రపంచ జనసందోహమునకు ప్రాణభిక్ష పెట్టిన సుబ్బారావుగారు, కనీసం మరోపది ఏండ్లయినా బ్రతికివుంటే, యింకెన్ని మహోత్కృష్ట విషయాలనుకనుగొనేవారో! మనవాళ్లనిపీడించుచున్న యింకెన్ని దుష్టవ్యాధుల శలమట్టంగావించియుండేవారో!!

సుబ్బారావుగారిమృతికి అమెరికాలోనిపత్రికలన్నీ వాపోయినాయి. అమెరికాకు, లెడర్లీ లెబొరేటరీస్ సంస్థకు, చెందిన, ఏ ప్రముఖవ్యక్తి మన దేశానికి వచ్చినప్పటికి వేనోళ్ళ సుబ్బారావుగారిని మెచ్చుకుంటూ, ఆయన జీవిత విశేషాలను వర్ణించనిదే వూరుకోవుటలేదు. వాళ్ళ దేశములో స్థిరపడిపోయి అత్యంత ప్రతిభాయుత విశేషాలు సాధించి తనకు, అమెరికా దేశానికి కీర్తినార్జించి పెట్టిన మహనీయుడు కదా సుబ్బారావుగారు! క్రిందటేడు మార్చిలో బొంబాయి వద్దనుండే బుల్సార్ గ్రామంలో అమెరికన్ సయానమైడ్ కంపెనీ సహకారంతో స్థాపింపబడ్డ, 'అతుల్ ప్రాడక్ట్స్' (Atul Products) కంపెనీ తెరిచే సందర్భంలో అమెరికన్ సయానమైడ్ కంపెనీ వైస్ ప్రెసిడెంటు, డాక్టర్. సిడ్నీ. సి. మూడీ (Dr. Sidney C. Moody), ఈ ఏడాది మేలో 'పర్నిరా' గ్రామములో మన దేశంలో ఫోలిక్ యాసిడ్, ఆరియోమైసిన్ తయారు చేయుటకు స్థాపింపబడ్డ, లెడర్లీ లెబొరేటరీస్ (ఇండియా) వారి భవనములు తెరిచే సందర్భంలోనూ మన దేశంలోని అమెరికా రాయబారి జార్జి వి. అలెన్ (Giorge V. Allen) అమెరికా లెడర్లీలెబొరేటరీస్ యొక్క విదేశ వ్యాపారశాఖ డైరెక్టరు ఆర్. టి. బోగన్ (R. T. Bogan) లు, ప్రత్యేకంగా పనికట్టుకుని సుబ్బారావుగారిని ప్రస్తుతించారు. అంతేకాదు. 20 లక్షల ఖర్చుతో మన దేశములో స్థాపింపబడ్డ లెడర్లీ లెబొరేటరీస్‌ను సుబ్బారావుగారికి అంకితం చేశారు. ఆయన యొక్క కాంస్యఫలకం సింహద్వారం వద్ద ప్రతిష్ఠించారు.

ఆ ఫలకంమీద, సుబ్బారావుగారి శిరస్సు చుటూ యిట్లా చెక్కబడి వుంది. "జీవితపు నిడివిని మాత్రమే విజ్ఞానం పెంచుతుంది. మతము జీవితపు లోతులను పెంచుతుంది". Science Simpoly Prolongs, Life Religion Deepens It. పతకస్థలము క్రిందుగా "ఎల్లాప్రగడ సుబ్బారావు 1896-1948 శాస్త్రజ్ఞుడు, అధ్యాపకుడు, వేదాంతి, దయార్ద్ర హృదయుడు, లెడర్లీ లెబోరటరీ డైరెక్టరు. అని వ్రాయబడి వుంది.

ఈ అమూల్య అరకూట స్మృతి ఫలకాన్ని 'ఆవిష్కరించే' అవకాశము, అమెరికావారు ఏ రాజకీయ నాయకుడికో యివ్వక వెంకమ్మ గారికే ఎందుకు అనుమాద్భాగ్యము అందజేశారు? అది వారికి సుబ్బారావుగారి ఉన్నత జీవితముమీది భక్త్యనురాగాల సూచన. అట్టి పుత్రరత్నాన్ని కన్న వెంకమ్మగారి మీది గౌరవము మీదు మిక్కిలి రాజకీయాలకంటె మహోన్నతమయిన విజ్ఞాన వికాసాలకు యిచ్చే నివాళి. ఆంధ్రదేశంలోని ఒక కుగ్రామంలో, హిందూదేశంలో ఒక మారుమూలపడివున్న అవిడను వెదకి, ప్రత్యేకంగా పర్నిరా తీసుకునివచ్చి అవిడచేత ఆవిష్కరింప జేయడం ఎంత గొప్ప విషయమో ఆలోచించండి! శరీరము పులకాంకురితమయ్యే దృశ్యమిది. దీనికినిస్సందేహంగా అమెరికావారు బహుధా అభినంద్యులు. విజ్ఞానానికి జాతిమత వర్గ విభేదాలు లేవనే పరమసత్యాన్ని వేనోళ్ల చాటుతుందది. అట్టి ఆంధ్రఘనుని, దివ్యచరిత్ర ఆంధ్రదేశపు యువక విజ్ఞానులోకానికి ఆదర్శ భూతములాలని ఆంధ్ర శాస్త్రవేత్తలు, ప్రపంచ విఖ్యాతి పొందాలని ఆంధ్ర దేశ సౌభాగ్యము పెంపొందాలని ఆశించుదాము. సుబ్బారావుగారు చదువుకున్న నర్సాపురం టెయిలర్ హైస్కూలు, రాజమండ్రి వీరేశలింగం హైస్కూలులలో యీ సుబ్బారావుగారి తైలవర్ణ చిత్రం స్థాపించవలసిన అవసరం ఎంతైనా వుంది.

విజ్ఞాన పరిశోధనా బుద్ధుడైన ఎల్లాప్రగడ సుబ్బారావుగారు, నిజంగా ధన్యజీవి. స్మృతిజీవి అమరజీవి.!!

ఆంధ్ర ప్రభుత్వోద్యోగాలు స్వీకరింప వెళ్ళేసందర్భంలో శ్రీయుతులు కె కోటేశ్వరరావు, శ్రీ టి. సూర్యనారాయణ శాస్త్రిగార్ల గౌరవార్థం విజయవాడ పురపాలకోద్యోగస్థుల సంఘంవారు విందు చేసినప్పటి చిత్రం.

ఆంధ్ర శాసనసభ డిప్యూటీ స్పీకరుగా ఎన్నికైన తర్వాత పసల సూర్య చంద్రరావుగారు ప్రప్రథమంగా తాడేపల్లిగూడెం పత్రికాప్రతినిధుల సమావేశంలో పాల్గొన్నప్పటి చిత్రం.

విజయవాడలో ఆంధ్ర వ్యాయామకళాశాల సహాయార్థమై నేషనల్ ఆర్ట్ థియేటర్ వారు ఆంధ్ర గవర్నరు శ్రీ త్రివేదిగారి సమక్షమున ఆషాఢభూతి నాటకం ప్రదర్శించారు. అందులోని ప్రధాన భూమికలను చిత్రంలో కుడి ఎడమ చివరలందు చూడవచ్చు.



సీరియల్ ★ రచన:- ఫిరోజ్ చంద్

# పంజాబ్ కేసరి

## 1 లాలా లజపతిరాయ్

క్రిస్మస్ పండగ యింకొక పక్షం రోజులు మాత్రమే వుంది. వేడుకలు ప్రారంభించటానికి సర్వ ప్రయత్నాలు జరుగుతున్నయ్. ఉన్నట్టుండి, బ్రిటిషు సర్వసేనాని, సర్ హ్యూగ్ గౌహ్ను డిశంబరు 11వ తేదీకి యేర్పాటు చేసుకున్న విందు వినోదాల కార్యక్రమాన్ని హఠాత్తుగా రద్దుచేశాడు.

1845 శిశిరఋతువులో వాతావరణమంతా కొంచెం తీవ్రస్థాయిలోకి పరిణమించింది. సిక్కు సైన్యాలు సట్లేజినదిదాటి పురోగమించి వస్తున్నాయని అంబాలాకు వర్తమానం రావటమే ఈ ఉత్సవ కార్యక్రమాలు రద్దుగావటానికి కారణం.

సట్లేజినది రంజిత్ సింగ్ సామ్రాజ్యానికి కట్టకడపటి హద్దుగా వుండాలని బ్రిటిషువారి వాదం. రంజిత్ సింగ్ సామ్రాజ్యానికి కట్టకడపటి సైనిక స్థావరాలుగావున్న ఫిరోజ్‌పూర్, లూధియానా మొదలైన ప్రదేశాలు కొన్ని అప్పటికే బ్రిటిషువారికి వశమైవున్నా సట్లేజికి పశ్చిమంగా రంజిత్ సింగ్ వంశీయులు యింకా అప్పటికి కొంత సామ్రాజ్యాన్ని పరిపాలించుతూనే వున్నారు.

ఉభయపక్షాలూ కూడా తాడూ బొంగరమూ తేల్చుకోవలసిన పరిస్థితి యేర్పడ్డది. గవర్నర్ జనరల్ హార్డింజ్ కూడా సర్వసేనానితో కలసి బాధ్యతలు పంచుకుని సాయపడటానికి స్వయంగా అంబాలాకు వచ్చాడు. ఊపిరి సలపని కార్యక్రమం వేగాలు నిర్ణయించుకోవటానికి కూడా వ్యవధిలేక గవర్నర్ జనరల్ ఏ చెట్టుక్రిందనో కూర్చుని హడావిడిగా ఉత్తరప్రత్యుత్తరాలు నిర్వహించుకుంటున్నారు.

ప్రస్తుతం స్విట్జర్లండులో కాపురం పెట్టియున్న సుప్రసిద్ధ నటుడు చార్లీ చాప్లిన్ సతీమణియున్ను, ఆయన ముగ్గురు ముద్దుబిడ్డలున్ను కాలక్షేపంగా స్విట్జర్లండు మంచులో కుశాగా తిరుగుతున్న దృశ్యం.

డిశంబర్ 18 తేదీన ఉభయ సైన్యాలూ ముడ్కిదగ్గర తారసిల్లినై. హార్డింజ్ స్వయంగా ఒక బ్రిటిష్ సైనిక దళానికి నాయకత్వం వహించి నడుపుతున్నాడు.

సిక్కులపటాన తెగింపు చేయగలవారూ, వీరోచితంగా పోరాడగల యోధులూ అనేకమందివున్నా, నాయకత్వం వహించి, యుద్ధకార్యాన్ని యోగ్యమైన పంథాలో నడపగల తగిన సారథి యెవరూ లేరు. పంజాబ్ కేసరి రంజిత్ సింగ్ చనిపోయి అప్పటికే ఆరేళ్ళయింది.

అదేరోజున-1845 డిశంబర్ 18 తే, ఆ రణక్షేత్రానికి 80 మైళ్ళదూరంలో వున్న జాగ్రాన్ అనే ఒకచిన్న పట్నవాసంలో రాధాకిషన్ అని శిశువు జన్మించాడు. 'పంజాబ్ కేసరి' అన్న తొలి బిరుదాన్ని తిరిగి కైవసం చేసుకున్న మహాపురుషుడు ఈ శిశువుయొక్క సంతానమే.

ముడ్కీలో సిక్కులకు పరాజయం కల్గింది. రెండుమాసములపాటు పరిసర ప్రాంతములలో యిక్కడాఅక్కడా కొన్ని సంఘర్షణలు జరుగుతూవచ్చినా విజయం బ్రిటిష్‌వారికే దక్కింది. బ్రిటిషువారు లోగడ రంజిత్ సింగ్‌తో చేసుకున్న ఒడంబడికను త్రోసి రాజని సట్లేజి ఉపరిభాగాన పంజాబ్ ప్రాంతాన్నంతా ఆక్రమించుకున్నారు.

### అగర్వాల్ వంశీయులు

పంజాబులో బ్రిటిష్‌పరిపాలన యేర్పడేనాటికి చరిత్రలో సంబంధం వున్న, అగర్వాల్ వంశీయులలోని యీ శాఖవారు, చాలా కాలము ఫిరోజ్‌పూర్, లూధియానా పరిసర ప్రాంతాలలో నివసించుతూ వుండేవారు. లజపతి రాయి వంశీయులు జాగ్రాన్ అనే చిన్న పట్నంలో ఆవాసంగా వుంటున్నారు. ఇది లూధియానా జిల్లాలో వుంది. ఈ వంశీయుల ప్రాచీన గృహం యింకా జాగ్రాన్‌లో వుంది. ఈ యింట్లో యిప్పుడు లజపతిరాయ్ తమ్ముడు వుంటున్నారు. అక్కడ ముష్టి రాధాకిషన్ పేర కుమారులు నిర్మించిన పాఠశాల కూడా వుంది.

రాధాకిషన్ తండ్రి జాగ్రాన్‌కు చేరువలో వున్న ఒక గ్రామానికి పట్వారీ (కరణం) గా పని చేస్తూ వుండేవాడు. లజపతిరాయ్ ఆయన్ను గురించి వ్రాసినదాన్నిబట్టి ఆ మానవుడు చాలా పొట్టి సరళమనస్కుడనీ, సర్వవిధాలా ధనార్జన చేసే విషయంలో చాలా ఆసక్తి కలవాడని తెలుస్తుంది. శ్వేతాంబర జైనమత శాఖకు చెందినవాడు. శ్వేతాంబర సాధుపుంగవుల సేవపరమ పవిత్రమైన జీవితాదర్శంగా కలవాడు.

ఆయన భార్య యిందుకు కేవలం భిన్నమైన వ్యక్తిత్వం గల మనిషి. భర్తకు డబ్బుపోగు చెయ్యటం పరమార్థమైతే, ఆవిడ చేతికందిన దాన్నల్లా యిరుగుపొరుగు పేదసాదలకు పంచిపెట్టి సాయపడటం పరమాశయం. అందుచేత భర్త వీలయినంతవరకు ఆమెచేతికి డబ్బుఅందకుండా చూస్తూవుండేవాడు. ఆవిడకు భూషణాంబరాలపట్లకూడా అభిలాష వుండేదికాదు. నిరాడంబరజీవి. చనిపోయిన ఆవిడ అడపాదడపా ఆవేశించి భూరి భవిష్యద్దర్శనాలు పలుకుతూ వుండేదట. లజపతిరాయ్ ఈ విషయాన్ని గురించి వ్రాస్తూ 'ఆమె సొంతం ఎల్లాంటికలాకపటమూ యెరుగనిమనిషి, ఆరోగ్యవంతురాలు. ఎప్పుడూ జబ్బుపడ్డది కూడా లేదు' అని ఉల్లేఖించారు.

లజపతిరాయ్ తాతగారు ఒకరోజు [illegible] సాయాసంగా దేహం చాలించారు.

రాధాకిషన్ బడికి పోవలసివచ్చిన నాటికే ఈ దేశంలో అమలు జరుగవలసిన విద్యావిధానంమీద మెకాలే తన అభిప్రాయాన్ని వెలువరించారు. బ్రిటిష్‌వారు ఆ గ్రామంలో స్థాపించిన పాఠశాలలో ఒక మౌల్వీ ఉపాధ్యాయుడుగా వుండి పర్షియన్ అరబ్బీ భాష నేర్పుతూ వుండేవాడు.

సున్నీ తెగకు చెందిన ఆ మహానుభావుడు మతగురువుగానూ సౌశీల్యవంతుడు. తన మతంపట్ల అచంచలమైన భక్తివిశ్వాసాలు కలవాడు. ఆయనవ్యక్తిత్వం శైశవదశలో వున్న రాధాకిషన్ హృదయాన్ని ఇస్లాంమతం వైపుకు ఆకర్షించింది. ఆ మత గురువు ఉదార సౌశీల్యాలు కారణంగా, అనతికాలంలో ఆయన దగ్గర చదువుకున్న అనేకమంది ఇస్లాంమతం పుచ్చుకున్నారు. అలా పుచ్చుకోకుండా మిగిలిన వారిలో కూడా చాలామంది మానసికంగా ఇస్లాం మతాన్ని అంటి పెట్టుకుని వుండేవారు. అట్టి వారిలో రాధాకిషన్ కూడా ఒకరు. రాధాకిషన్ రోజూ మామూలు నమాజ్ మాత్రమే కాక యోగ్యుడైన నమాజీగా వుండేవాడు. రంజాన్ వచ్చిందంటే దిక్కులేని మహమ్మదీయులతోపాటు ఉపవాసాలుండేవాడు. అనేక మంది మహమ్మదీయులతో సాంగత్యం చేస్తూవుండేవాడు. ఆ మహానుభావు

[10 వ పేజి చూడుడు]

# పదేండ్లలో అమెరికా

— లిలియన్ స్మిత్ —

మరొక పదేళ్ల తర్వాత అమెరికాలో నీగ్రో సమస్య అనేదే వుండదు. అయితే అప్పుడు కూడా కొద్ది మంది మనస్సులలో నీగ్రోల పట్ల విచక్షణ భావం ఉండక పోదు. కాని, ఏహోటలుమీదగాని, సినిమాలమీదగాని, పాఠశాలలమీదగాని 'నీగ్రోలు రాకూడదు' అనే బల్లలు ఉండవు. ప్రజాస్వామ్య సిద్ధాంతానికి కళంకం తెస్తున్న నీగ్రో జాతి విచక్షణ చట్టాల ద్వారా నశింపజెయ్యబడుతుంది.

పది సంవత్సరాలలో ఇలాగ జరుగుతుందని చెప్పడానికి ఏ జ్యోతిష్కుడూ అవసరం లేదు. ఈ మధ్య అమెరికా దక్షిణరాష్ట్రాలలో జరిగిన సంఘటనలను సూక్ష్మంగా పరిశీలించి ప్రపంచ సంఘటనలతో వాటిని పోల్చిచూడ గలిగిన వారికి శిల్లాధి వ్యక్తులలో జాతి విచక్షణ సిద్ధాంతానికి తావులేదని స్పష్టంగా తెలుస్తుంది. జాతి విచక్షణను పాటించడానికి భవిష్యత్తులో అవకాశమే లేదని గ్రాహ్యమవుతుంది.

ఏ ప్రభుత్వమూ కూడా చెడ్డవాళ్ళను మంచివాళ్ళుగా చెయ్యలేదు. భగవంతుడు కూడా చెయ్యలేడు. ...టొంచ్చి, ప్రజాస్వామిక ప్రభుత్వం చెయ్యగలిగిందీ, చెస్తున్నదీ ఏమిటంటే మానవుల హక్కులను కాపాడడం అంటే ప్రజలు ఎంత మంచిగా ఉండదలిస్తే అంతగా వారి హక్కులను రక్షించడం. ఏ ప్రభుత్వమూ కూడా ప్రజల దారిద్ర్యాన్ని గాని, అనారోగ్యాన్ని గాని, అజ్ఞానాన్ని గాని ...

ప్రాటిసెంటు స్కూళ్లు నీగ్రోలకు ప్రవేశమిస్తున్నాయి.

ఇటువంటి మార్పులు ఇంకా ఎన్ని సందర్భాలలో జరుగుతున్నాయి! రైలు, బస్సు ప్రయాణాల సందర్భంలో కూడా త్వరత్వరగా మార్పులు వచ్చాయి.

తెల్లవారు ఫలహారాలు తినే రైలు పెట్టెలో నీగ్రోలు తినకూడదని చాలా కాలంగా నిషేధం వుంది. ఇప్పుడది పోయింది. ఇది సాంఘికంగా చాలా పెద్దమార్పు అని మా దక్షిణాది వారు తలపోస్తారు. ఈ నాడు రైలు బండిలోని ఫలహారాల పెట్టెలో నీగ్రోలు, తెల్లవారు కూడా ఒకరి సరసను మరొకరు కూర్చొని తింటూంటే మహా ఆనందం కలిగిస్తూంది. ఎవరికీ కూడా ఏవగింపు గాని, చీదరింపు గాని లేదు. ఇదంతా నిశ్శబ్దంగా జరుగుతూంది. మా దక్షిణాది వారి మంచి స్వభావానికి మాట దక్కింది.

మా వాళ్లను గురించి కొంత చెప్ప వలసిన అవసరంవుంది. మాలో కూడా సంకుచిత స్వభావం ఉన్నవాళ్ళూ, పెడబుద్ధి గలవాళ్ళూ, దురాగ్రహులూ లేకపోలేదు. కాని వాళ్ల సంఖ్య చాలా తక్కువనుకుంటాను. అయితే, రాజకీయ నాయకులూ, వారి విభేదాలను ...

లన్నీ స్వల్పమైనవిగా కనిపించవచ్చు. ఇంకా జరగవలసింది చాలావుంది. సిమెంటుగోడల్లాగ అవరోధాలు కలిగిస్తున్న విషయాలు అనేకం ఉన్నాయి. ఏ వొక్క మార్పు జరిగినా అది ఆనకట్టకు ఒక కన్నం పడడమన్నమాట. చిన్న చిన్న కన్నాలు పడగాపడగా అవన్నీ కలిసి పెద్దకన్నమవుతుంది అప్పుడు దానిని మూసివెయ్యడం అసాధ్యం. చివరకు దానిలో నుంచి నీరు శరవేగంతో ప్రవహించి, పాత కట్ట తెగిపోయితీరుతుంది. ఇంతకంటె మార్గాంతరం లేదు. ఎందుకంటే, ప్రపంచాన్ని చైతన్యప్రవాహం ముంచెత్తి పరిణామాలు తీసుకొస్తూంది.

దక్షిణాదిన జాతివిచక్షణ మూఢనమ్మకంగా అనుసరించబడేది. 'ఈ పని చేశావంటే చచ్చిపోతావు, లేదా నీవాళ్లు చచ్చిపోతారు - ఘోరవిపత్తులో పడిపోతావు, ఇదీ మూఢనమ్మకం. మూఢనమ్మకాన్ని కాదని ఎదురు తిరగకూడదు. అక్షరాలా ఆ ప్రకారం చేయ్యవలసిందే. ఎవరూ కూడా ఎదురు తిరగకుండా, భయపెట్టి ఆ ప్రకారం చేయించడంలో నేవుంది దాని ప్రభావం. ఎవడో ఒకడు ఎదురుతిరుగుతాడు, మరొకడు, వానితరువాత మూడో వాడు ...

(9వ పేజీ చూడుడు)

ప్రకృతి స్వభావం చాలా విచిత్రమైంది. మనీ బొగ్గులో మాణిక్యాలు పుట్టిగడ్డలో సువర్ణాలు, రాళ్ళలో రతనాలు ఆలిచిప్పలో ఆణిముత్యాలు, పాలాహలంలో అమృతము, ముళ్లకంచెలో ముద్దు గులాబీలు అనుకోని విధంగా ఊహాతీతంగా ప్రతి ఫలిస్తుంటాయి.

సదానందుడు పుట్టుకతోనే కుంటివాడు. అతడు గర్భంలో వుండగా తల్లి చంద్రగ్రహణాన్ని చూచిందని కొందరంటుంటారు. గ్రహణకిరణాలతో వికలాంగులుదయిస్తారని హిందూ సమాజంలో చాలమంది నమ్మకం. అందులో నిజమెంత మిటుకున్నదో చెప్పడం ఒకవిధంగా అసాధ్యం కాని సదానందునిలో శిల్ప నైపుణ్యం చిగురు లెత్తింది.

మానవ సహజాతంలో శిల్పానికి ప్రత్యేక స్థానముంది. ఆ సహజాతం చిన్న తనంలోనే వికసించడానికి వువ్విళ్లూరుతుంది. కానీ పొరపాటు తనంతో ఆ మొగ్గ వికసించకముందే గిల్లి వేయబడుతుంది. లేదా మొగ్గదశలోనే మార్చివేయబడుతుంది.

సదానందుని శిల్ప సహజాతాన్ని గిల్లి వేయ దలచినా అది సమాజం యొక్క పులిగోళ్లకు అందక తప్పించుకొన్నది. కీకారణ్యంలో అడవిమల్లెలాగా అది పెరుగుతూ వచ్చింది.

సదానందం పసితనంలోనే ప్రకృతి చిత్రపరిశీలన ప్రారంభించాడు. వెండివెలుగులో దూదికొండల మధ్య పండు జాబిల్లిని చిత్రించాడు. ధగధగలాడే తారల తీరులు. ...

## కథానిక
# చిత్రకారుడు
కె. సభా

కల్లోల పూరితాలు, సాంఘిక సమరాంగణంలో జీవన పోరాటాలు జయాపజయ సమ్మేళనములు. ఎదిగే లతలు ఎండిపోతాయి. వచ్చే అంకురాలు చిగురులు తొడుగుతాయి. పుచ్చిన విత్తులు మొలకలెత్తుతాయి. బంగారంలాంటి జీవనసుమాలు వాడి వత్తలై వరుగులై మిత్తి పాలిఘటనలో ధూళియై పోతై.

ఎనిమిదవ తరగతి పూర్తి కాలేదు కానీ సదానందుడు ఆ తరగతిలో మూడు మాసాలు దొరలక నే నిలిచిపోయాడు. అక్షరాలు ముత్యాల కోవలు. సదాల వరుసలు పసిడి కుసుమాల తోరణాలు. అంచేత పేటలో బట్టలకొట్టు యజమాని లెక్కా పక్కా వ్రాయడానికి దిగరుంచుకొన్నాడు. నెలకు పది రూపాయలు జీతం. పదిహేళ్ల వయస్సులోనే తన కొడుకు సంపాదనా పరుడైనందుకు తల్లి అపరిమితంగా సంతసించింది.

ఉదరపోషణకు సంబంధించిన ఉద్యోగం కనుక సదానందుడు చాలా జాగ్రత్తగానే వ్యవహరిస్తున్నాడు. పనిలేనపుడు మాత్రం డబ్బులు పెట్టి ...

పదియూపాయల నోటు కనిపించినై, సదానందుడు వణికే చేతులతో ఎందుకు బాబూ ఈ డబ్బు అన్నాడు. నీ రెండు చిత్రాలకు నేనివ్వగలిగిన పారితోషికం యిదే నన్నాడు. సదానందుని కేమీ అర్థంకాలేదు. వ్రాసిన చిత్రాలను డబ్బులిచ్చి పుచ్చుకొనేవారుంటారని గూడా అతనికి తెలియదు. ప్రసాదు అతణ్ణి దగ్గరకు తీసుకొచ్చి బెట్టుకొని చిత్రాలు వ్రాస్తున్న వారిపేర్లు, చిత్రప్రదర్శనలు, ప్రచురించే పత్రికలు, చిత్రకళా పోటీలు తదితర విషయాల గురించి చిన్న ఉపన్యాసం యిచ్చాడు. ఈ మారు వచ్చేటప్పుడు మంచి డ్రాయింగ్ షీట్లు, సున్నితమైన కుంచెలు మేలైన రంగులు, బొమ్మలు ప్రచురించిన పత్రికలు తెస్తానని మాట యిచ్చాడు. ఆ యాభై రూపాయలు ఉంచుకోమని చెప్పాడు. సదానందుని విషయంలో ఉదారంగా వుండాలని తండ్రికి చెప్పి తాను పట్నానికి వెళ్లి పోయాడు.

తాను మంచి చిత్రాలు వేయాలని, ఖరీదైన రంగులు వాడాలని సదానం ...

యుక్త వయస్సు వచ్చిందని అందుకనువైన దాంపత్యలంటగట్టడం తల్లి దండ్రుల కలవాటు. అది సంతోషంతో నిండిన దాంపత్యగా వారు పరిగణిస్తారు.

సదానందునికి ఇరువదేళ్ళు నిండకున్నా పెళ్లి చేయాలనుకున్నది తల్లి. సదానందుడు కుంటివాడైనా బాధ్యస్తుడు గనుక మేనమామ బిడ్డనివ్వడానికి ఒప్పుకున్నాడు. సుందరాల నొలకబోసే సుందరి అందచందాలు సదానందునికి పరిచయమే తినవంటి కుంటివాణ్ణి పెళ్ళి చెసుకొని ఆమె ఎంతమాత్రం సుఖాన్ని అనుభవించబోతున్నదని నిరాకరించాడు సదానందం. కానీ సుందరి సదానందాన్నే పెళ్ళి చేసుకుంటానని పట్టుబట్టింది. ఇందులో అర్థం లేకపోలేదు. చిన్ననాటి చెలిమి అలాంటిది. ఈ చిత్రమైన పట్టుదలను గాంచి సాటి యువతులు చాటుమాటున పరిహసించినా సుందరి నొచ్చుకోలేదు. సదానందుడు సుందరి మనోభీష్టాన్ని తెలుసుకొని తానే స్వయంగా చెప్పిచూచాడు. కాని ఆమె వినలేదు.

సుందరీ సదానందుల పెళ్ళి నిశ్చయించబడింది. పేదల పెళ్లికి పెద్ద అట్టహాసాలుండవు. సినిమా తారల గానా బజానాలు లేక పోయినావివాహం జరిగిపోతుంది. జిలేబిలు లడ్డుండలు లేకపోయినా తిండి దిగిపోతుంది. సదానంద సుందరీల వివాహం చాలా నిరాడంబరంగా జరిగింది. గొప్ప వారెవరూ రాలేదు. ఒక్క ప్రసాదు మాత్రం వచ్చి ఒక చిన్న ఉంగరాన్ని చదివించి వెళ్లాడు.

సదానందుని జీవన నాటకంలో రెండవరంగం ప్రారంభమైంది. సుందరి సదానందుడు వ్రాసిన ప్రతి చిత్రాన్ని అత్యంత శ్రద్ధతో భద్రపరుస్తుండేది. వాటిని చాలా జాగ్రత్తగా దాచి పెడుతుండేది.

సదానందుని తల్లి శ్రమజీవి. రోజు కూలికి వెడుతుండేది. ఎదో వచ్చిన ఆదాయాన్ని తెచ్చి కుటుంబాన్ని సర్దుతుండేది. సదానందుడు పెళ్ళి చేసుకొన్నాడు గనుక ప్రసాదు తన తండ్రితో చెప్పి మరో మూడు ... వున్నది ముగ్గురేగనుక కుటుంబంలో పస్తులుపడకుండా కాలక్షేపం చేస్తూ వస్తున్నారు.

ఈలోగా ప్రసాదు యింటికివచ్చాడు. మేలైన డ్రాయింగుషీట్లు, పసందైన రంగులు, కుంచెలు తెచ్చి సదానందుని కిచ్చి బొమ్మలు వ్రాయమన్నాడు. ఈ కాగితాలను చిత్రలేఖనా పరికరములను ఉంచుకోడానికొక జాజికాయ చెక్కలపెట్టెను తయారుచేసి పెట్టాడు. కూచోని బొమ్మను గీయడాని కనువుగా ఒక వ్రాతబల్లను యింటిలో నుండి తీసియిచ్చాడు.

సదానందుడు అపరిమితోత్సాహం

(9వ పేజీ చూడుడు)

